# స్వామి వివేకానంద

రచన

చిల్లర భవానీదేవి

ప్రచురణ

శ్రీ మానస పబ్లికేషన్స్

శ్రీపతి సూర్యనారాయణ వీధి

గవర్నరుపేట : : విజయవాడ - 520 002.

# స్వామీ వివేకానంద

చిల్లర భవానీదేవి

శ్రీ మానస ప్రచురణ
ప్రధమ ముద్రణ
మే - 2001

వెల. రు. 14-00

లోపలి బొమ్మలు } కరుణాకర్
ముఖ చిత్రం }

# స్వామి వివేకానంద

భారత జాతిని మేలుకొలిపిన మహనీయులలో వివేకానందుడు గొప్పవ్యక్తి. దేశ స్వాతంత్ర్య భావనను ప్రేరేపించి భారతీయ ఆత్మను నిలిపిన మహనీయుడు ఆయన. ధైర్యం, శ్రద్ధ, జ్ఞానం, ఐక్యత శ్రీ వివేకానందస్వామి ప్రబోధం. కలకత్తా మహానగరంలో శ్రీ విశ్వనాథ దత్త, భువనేశ్వరీ దేవి దంపతులుండేవారు. శ్రీ దత్త హైకోర్టు న్యాయవాది. భువనేశ్వరీ దేవి తనకు నలుగురు ఆడ పిల్లలున్నారని మగశిశువు కోసం ప్రార్థించింది.

తమ ఇలవేలుపు అయిన వీరేశ్వరునికి రోజూ పూజలు చేసింది.

1893 వ సం॥ జనవరి 12వ తేదీ భగవంతుని కరుణతో నరేంద్రుడు జన్మించాడు. చిన్నతనంలో నరేంద్రుని ముద్దుపేరు 'బిలె'. బిలె చాలా అల్లరివాడు. అతని అల్లరి ఆపటానికి తల్లి "నరేన్ నీవు తుంటరితనం చేస్తే శివుడు కైలాసానికి రానీయడు" అనేది. శివనామం పలుకుతూ బిందెలనీళ్ళు అతని తలపై పోసేది. నరేన్ స్వభావం పరమ శాంతంగా మారిపోయేది. నరేన్‌కు జంతువులన్నా, పక్షులన్నా ప్రేమఎక్కువ.

తల్లి నరేన్‌కు వంగభాష, ఆంగ్లము నేర్పింది.

ఇతిహాసకథలు చెప్పింది.



పాఠశాలలో నరేన్ అన్నింటిలో మొదటివాడు. తోటి పిల్లలతో కలిసి ధ్యానం చేసేవాడు. ఒకసారి అలా ధ్యానం చేస్తున్నప్పుడు పెద్ద పాము వచ్చింది. పిల్లలంతా భయపడి పారి పోయారు. నిశ్చల ధ్యానంలో ఉన్న నరేన్ మాత్రం కదల లేదు. పెరిగి పెద్దవాడవు తున్న నరేన్ దేవగానం పాడేవాడు. దానధర్మాలు చేసేవాడు. తల్లి అతనిని గదిలోపెట్టి తాళం వేసింది. అయినా నరేన్ కిటికీలోంచి సాధువులకు ధానధర్మాలు చేసేవాడు.

భయమంటే అతనికి తెలియదు. ఏ విషయమైనా స్వయంగా తెలుసుకుంటేగానీ నమ్మడు. అతని జ్ఞాపక శక్తి అమోఘమైనది. క్రమంగా దేవుడు ఉన్నాడా లేడా అనే అనుమానం నరేన్‌లో మొదలయింది. పాశ్చాత్య తర్కశాస్త్రములను బాగా చదివాడు. దేవుని ఎవరైనా చూశారా అనే వెదకులాట మొదలు పెట్టాడు. ఎందరినో ప్రశ్నించాడు. అందరూ తమకు తోచినది చెప్పారు. అయినా అతనికి తృప్తిగా లేదు.

శ్రీ రామకృష్ణ పరమహంస గురించి నరేన్ విన్నాడు. ఆయన వద్దకు వెళ్ళాడు. 'నాయనా

వచ్చావా' అంటూ రామకృష్ణుడు నరేన్‌ను ఆహ్వానించాడు. దక్షిణేశ్వరంలో కాళికాలయంలో రామకృష్ణుడు పూజారిగా ఉన్నాడు. నరేన్ 'అయ్యా మీరు దేవుని చూశారా' అని రామకృష్ణుని అడిగాడు. వెంటనే ఆ మహానుభావుడు'చూశాను' అనిచెప్పాడు. 'నిన్ను ఎలా చూస్తున్నానో దేవుని కూడా అలాగే చూశాను. దానికి పరితాపం ఉండాలి' అన్నాడు.

ఈ జవాబు నరేన్ జీవితాన్ని మార్చివేసింది. రామకృష్ణుని గురువుగా స్వీకరించాడు. ఆయన బోధనలతో నరేన్‌లోని నిద్రాణ శక్తి మేల్కొన్నది.

1885 వ సం॥ రామకృష్ణునికి జబ్బు చేసింది.

నరేన్‌ను పిలిచి తనలోని శక్తినంతా అతనికి



ధారపోశారు. ఆ శక్తితో ప్రపంచానికి దైవత్వాన్ని

చూపమని కోరారు పరమహంస. నరేన్ తన

గురువును రాముని, కృష్ణుని అవతారంగా తెలుసుకున్నాడు. 1886 వ సం॥ ఆగష్టు 16వ తేదీన రామకృష్ణుడు మహాసమాధి అయినారు.

గురుదేవుని కార్యాన్ని నెరవేర్చే బాధ్యత నరేన్ స్వీకరించాడు. 13 మంది శిష్యులంతా సన్యాసం స్వీకరించి మఠం స్థాపించారు. నరేన్ సన్యాస నామం వివేకానందుడు. అంతా అతనిని 'స్వామీజీ' అని పిలిచారు. వివేకానంద భారత దేశమంతా పర్యటించి వివిధ మతాల ప్రజల ఆచార వ్యవహారాలు గ్రహించారు. దేశ బీదరికం



ఆయనను బాధించింది. కన్యాకుమారి పాదాలపై పడి ప్రార్థించాడు స్వామిజీ.

గుడి నుండి బయటికి రాగానే సముద్రంలో కొంత దూరాన పెద్ద కొండశిల కనిపించింది. ఈదు

కుంటూ ఆశిల చేరి ధ్యానంలో నిమగ్నులైనారు స్వామీజీ. దేశ గొప్పతనం, నేటి దురవస్థ ఆయనను కలవర పరిచింది.

ధ్యానంలో గొప్ప కర్తవ్య స్ఫురణ కలిగింది. పాశ్చాత్య దేశాలకు వెళ్ళి భారతీయ సనాతన ధర్మాన్ని తెలియజెప్పాలని అనుకున్నారు. భారతీయుల ఆధ్యాత్మికత వారికి ఇచ్చి వారి ఆధునిక విజ్ఞానం దేశానికి తేవాలనుకున్నారు. మద్రాసు వచ్చారు. చికాగోలో జరగనున్న సర్వమత మహాసభకు హాజరు కావాలని అందరూ స్వామీజీని కోరారు.

శ్రీ రామకృష్ణుడు సముద్రం కేసి నడుస్తూ తనతో స్వామీజీని రమ్మని పిలుస్తున్నారు. ఈ దృశ్యం స్వామీజీకి ప్రేరణ. చందాల సొమ్ముతో 1893 మే 31వ తేదీ బయలుదేరి సముద్ర మార్గం లో అమెరికా చేరారు. విశ్వమత మహాసభలో పలువురు మతాచార్యులున్నారు. వారి ఎదుట 'అమెరికా దేశ సోదర సోదరీ మణులారా' అని సంబోధించారు స్వామీజీ. చప్పట్లు మిన్ను ముట్టాయి. భారతీయ వాణిని, రామకృష్ణుని దివ్యవాణిని విన్పించారు స్వామీజీ. శ్రోతలంతా

పులకరించిపోయారు.



అన్ని మతాల సత్యాలను గ్రహించి ఓర్పు వహించుట భారతీయుల గుణం. మతం పేరిట కలహాలు వద్దని స్వామీజీ పిలుపు ఇచ్చారు. వివేకానందుని పేరు అమెరికా అంతా మారుమోగి పోయింది. ఆంగ్ల దేశానికి కూడా ఆహ్వానం అందింది. స్వామీజీ ఇంగ్లండునుండి భారత దేశానికి తిరిగివచ్చారు. భారతీయులలో కొత్త ఉత్సాహం స్వామీజీకి సంతోషాన్ని కల్గించింది.

సింహళం, రామనాథపురం, పరమకుడి, మధుర, కుంభకోణంలు దాటి 6-2-1897న మద్రాసు చేరారు స్వామీజీ. మద్రాసులో

స్వామీజీకి ఘన స్వాగతం లభించింది. విక్టోరియా

మంటపంలో స్వామీజీ ఉపన్యాసం చెప్పారు.



జాతిని మేల్కొలిపారు. మూఢవిశ్వాసాలు

వీడమని పిలుపుఇచ్చారు. స్వామీజీ కలకత్తా

చేరినారు. కలకత్తా వీధులు స్వామీజీ పాదస్పర్శతో పవిత్రమైనాయి. కలకత్తాకు దగ్గరలో బేలూరులో గంగా తీరాన శ్రీ రామకృష్ణ సేవా సంస్థను స్వామీజీ స్థాపించారు.

శ్రీ రామకృష్ణుడు తన జీవితాన్ని ప్రపంచానికి ధారబోశారు. స్వామీజీ కూడా జీవితాన్ని లోకానికి ఇచ్చారు. శ్రీ రామకృష్ణ మఠం

స్థాపన జరిగిన పిదప శిష్యులకు శిక్షణ ఇచ్చారు. ఆరోగ్యం సరిగా లేనందున స్వామీజీని ఉబ్బసం బాధించింది. 1898 వ సం॥ డిసెంబరులో

విదేశాలకు వెళ్ళాలనుకున్నారు. కానీ ఆ ప్రయాణం వాయిదాపడింది. 1899 వ సం॥ జూన్‌లో రెండవ విదేశీయానం ప్రారంభమయింది.

స్వామీజీ ఈసారి అమెరికాలో చాలాచోట్ల ఉపన్యాసాలిచ్చారు. స్వామీజీ ప్రవర్తన సరళంగా నిరాడంబరంగా ఉండటం గురుదాస్ బ్రహ్మచారిని ఆశ్చర్యపరిచింది. మహాద్భుతమైన స్వామీజీ నేత్రాలు చూపరులను నిలబెట్టి చొచ్చుకుపోతాయి. అనంతమైన శక్తిని స్వామీజీలో శిష్యులంతా చూశారు. ఉపన్యాసకుడుగా ఆయన

అద్వితీయుడు. అవసరం వస్తే తీవ్రంగా జవాబు చెప్పగలడు. కఠిన విషయాలు కూడా సామాన్యులకు అర్థం అయ్యే విధంగా చెప్పేవారు.

స్వామీజీ పవిత్రతకు ఎంతో ప్రముఖస్థానం ఇచ్చారు. తమ చివరియాత్రను ముగించిన స్వామీజీకి ఆరోగ్యం బాగా చెడింది. మనస్సు దృఢత్వం మాత్రం వన్నె తగ్గలేదు. తన మరణం గురించి శిష్యునికి చెప్పి తన శరీర కర్మకాండకు చోటుచూపారు. 1902 జులై 4వ తేదీ శుక్రవారం రాత్రి తొమ్మిది గంటలకు స్వామీజీ మహాసమాధి

పొందారు. ఆ నాటికి స్వామీజీ వయస్సు 39 సం॥ ఐదునెలల 24 రోజులు.

నవ్యభారతాన్ని సృష్టించటానికి భారతీయ ఆత్మతో దేశభక్తి కవచం పూనారు స్వామీజీ. కలకత్తా గంగా తీరంలో స్వామీజీ శరీరం దహించిన చోట నేటికీ ఆలయం ఉంది. ఒక మహనీయ అవతార మూర్తికి మృత్యువు ఉండదు. ప్రపంచమంతా భగవంతునితో ఐక్యం చెందేవరకు స్వామీజీ అంతటా వ్యాపించే ఉంటారు. సత్యాన్ని తెలుసుకున్న యోగీశ్వరుడు స్వామీ వివేకానంద.

ప్రపంచం కోసం జీవితాన్ని అర్పించిన త్యాగమూర్తి భారతీయ సనాతన ధర్మానికి ప్రతిరూపం పునరుద్ధరణకు ప్రతీక.